దవానలభక్షణము.

ఉ॥ కాళియసర్పముం గావిడిచి కంజదళాక్షుఁడు నిర్గమింప గో
పాలురు నందముఖ్యులును బంధుగణంబు గడుసంతసించి రా
త్రై లలిఁ గాఱుచిచ్చుఁ బొదువంగ ననంతుఁడు గ్రోలి లీలమైఁ
గేళి వనంబునం దునిమెఁ గృష్ణుఁడు గాడ్పులశం బ్రలంబునిన్॥ 66

మ॥ నిలువుండీరముఁ జొచ్చెఁ జిచ్చు పనులన్ నిండారఁగా సైగలం
బిలువుండీరమరం గనుంగొనకుఁ డీపీడం దొలంగించుమీ
చెలువుండీలము గానుఖంతమని యాచిచ్చున్ వడిన్ మ్రింగి తా
నలభాండీరముఁ జేర్చె వారి హరి కవ్యాక్షిప్త డిండీరముల్
దళడిండీరము, కాననాబ్ధికి మధూద్యద్గండ పెంఢారముల్॥ 67

గోపీవస్త్రాపహరణము.

సీ॥ పల్లైవల్లవులుల్లసిల్ల నల్లని గొల్లపిల్ల పిల్లనగ్రోవి పెదవిఁ దాదవి
మెల్ల మెల్లన నూఁది యల్లిబిల్లిగ నాదిగోళ్ల వ్రేళ్లను బాఁదుకొలిపి మెలపి
త్రుళ్లి మ్రోల్లి గురింపఁ జల్లచల్లఁగ రాగమల్లనల్లనఁ బాడుననుచుఁ జనుచుఁ
దల్లిపిల్లనుఁ బిల్లు తల్లి నొల్లక విని గొల్లతల్లులి మరులొ గ్రొనుచు ననుచు
నుల్లమునఁ బొల్చ్చన దినిల్చి సొమ్ములెలోల్చి। మొల్లముగఁ బెట్టి నీరాడఁ గొల్లఁ గొట్టి
యుల్లసములాడి మెఱచి సిగ్గల్లఁ జెఱచి। వల్లవుం డయ్యె రాధికావల్లభుండు॥ 68

విప్రవనితాశాపవిమోచనము.

మ॥ పసులంగాచుచు నాఁకటం బడలు గోపశ్రేణి నంపించి భా
త్రినురుల్ పొండన వారి యాంద్రకడఁ గోరింపన్ సతుల్ భక్ష్య భో
జ్యసమేతంబుగ వచ్చి యిచ్చిరథి మోక్షంబు బిబ్బ తచ్ఛాయల
వ్వసుధాదిత్యుల చేరఁబంచె హరి తత్పాత్రిగ్గన తత్కాపక్షుఁడై॥ 69

విప్రవనితాశాపకారణము.

మ॥ ఇది యెట్లన్న వెలుంగుఁ డాంగిరసు లగ్నిచ్ఛన్ విమర్శింప కీ
ముదితల్ మోహితలై రటన్న భ్రమచే మున్న గ్రకాపంబొసం
గి షయన్నిక్కమె ఱెంగి కృష్ణకృప ముక్తిం గం టిమీచాయలన్
నుదతీత్వంబు వహించి మమెత్తనయుఁడం చుంబల్కె వీరై రిటుల్॥ 70

గోవర్ధనోద్ధరణము.

సీ॥ ఏఁటేటఁ బచరించు నింద్రయాగము మాన్పి శైలేంద్రయాగనిశ్చయ మొనర్చి
గోవులకును భూమిదేవులకును దీనజీవులకును దృప్తిఁ జేయఁ బనిచి

గిరిరూపధారియైకృష్ణుండు నందాదులొసంగినవరదపాయసము లెల్లఁ
దానారగింపఁ బంతమున నింద్రుఁడు సప్తవాసరంబులు రాళ్లవానగురియ
గోవులను గోపికలనెల్లగోపకులను । గావ గోవర్ధనంబెత్తి కదలకుండ
గొడుగుగాఁబట్టుటరసి శక్రుండు వేడ । నతనిరక్షించె సప్తమహాయనమున॥ 71

## ఇంద్రప్రార్థనాంగీకారము.

మ॥ వెరఁగై యింద్రుఁడు చిక్కి మ్రొక్కి నుతుఁడై దివ్యచ్ఛపై నిత్సల
త్వ రమం బాయక ప్రోవుమంచుఁ బలుకం బ్రాణంబులప్పాండవుల్
ధరయేలింతును వారిచే రణములో ధాత్రీభరంబెల్లఁ దీ
ర్తు రహిం గంసముఖాదులందునిమి తోడ్తోనంచు కృష్ణుండనెన్॥ 72

## సర్వలోకప్రదర్శనాదిప్రశంస.

చ॥ వ్రతమొనరింప నందుఁడొకవాసరమందసురార్థవేళనా
ప్లుతుఁడగుచుండఁగా వరుణలోకముఁ జేర్చిరితద్భటుల్ మహా
ద్భుతముగఁ గృష్ణుఁడేఁగి పితఁదోడ్కొని రా వెఱగందిరంద ర
చ్యుతుఁడును సర్వలోకములఁ జూపెఁ దదర్థనసార్థకంబుగన్॥ 73

## సాయంకాలాద్యభివర్ణనము.

ఉ॥ అంత దినాంతమయ్యె హరిదంతరదంతురకాంతిశాఖి శా
ఖాంతర సంతరాయతనిజాయుతి నాపతనాతనూద్యమా
ద్భ్రాంతశకుంతమంతికదురంత వియోగభయాగళిత్షత
స్వాంతనితాంతతాంతమదనాకలనాకుల కోకకాంతమై॥ 74

* మ॥ అపరాద్రీభవిభుండురాకతతి ఛాయానక్రసంగ్రస్తదే
హపరార్థుండగుచున్ విరావయుతుఁడౌటాలించి మేలెంచి కా
లపయోజాత్ముఁడులీలఁ దద్గ్రహముదూలన్ సూర్యచక్రంబువై
చి పడంగొట్టఁగఁ జిమ్మునక్తమనమింశాన్ సాంధ్యరాగంబొగిన్॥ 75

క॥ ఇనశశులిరుమొగములు గాం । ఘనమగ లలిగరిణి కిరణజాలమువాతై
తనరెడు రోదసిమద్దెల । యనఁదగె ఖగరుతముగొమరుదిగాదుగదా॥ 76

## చంద్రోదయవర్ణనము.

క॥ ఉదయాచలవల్లీశా । భ్యుదితసమయభోగిభోగమోయనఁ జంద్రుం
డు దనర్చెఁ దత్కళంకము । మృదురుచియగు కృష్ణపాదమే కాదుగదా॥ 77

---

* పద్యాంతరము॥ క॥ అపరగిరికరితనువనా । తపమకరిగ్రహించు టెఱుఁగి తఱియును హరియుం
దపన సుదర్శనమునఁ ద । ద్రిపుఁ ద్రుమఁగఁ గ్రమ్మె నెత్తురే సంజగదా॥

క॥ చదల వెడు జమున మడువునఁ । బొదలు సమయు కాళియాహి భోగ ఫలకము
ట్లుదిత శశిబింబములరెం । దదంకమూ యుదూర్ధ్వహరిపదము గాదుగదా॥ 78

క॥ మిన్నని యోడిమున్నిటఁ । భిన్నంబగు శుక్తి కరణిఁ బెంపెసలారన్
వెన్నలదొర తాంకలుస । మున్నలిఁ బైఁబడిన ముత్యములు గావుగదా॥ 79

సీ॥ అలశరద్రాత్రియందలరుచుఁ గృష్ణుండు మురళి వాయింపఁగా ముదితలెల్లఁ
దమపనుల్ విడిచి తత్సన్నిధి కేగిరి దారానిసతులు తత్ప్రియ చిత్త
లైముక్తిఁగనిరున్న యన్ను మిన్నలఁగని వెన్నుఁడెన్నెన్ని యోవిధులు దెల్పి
బొమ్మత్రిన్నఁ బోతున్న మురిసికన్పడకున్న వెదకియుఁగనలేక విస్తికి కొసకు
తనత్రయతఁ గాంచి జనాత్ర దితచ్చరితలు । దామెయొనరించి మధురగీతములఁ బాడ
దనుగలిఁగి తోఁచి బ్రతిమాలి దానవారి । దానువారి రాసక్రీడఁ దనిసి తనిపె॥ 80

## సరోవరవర్ణనము.

చ॥ పరిపరి కేళికూళియను పల్లెరమం దరపోద్భుతమిత్రకీ
ల్బరిణలఁగ్రమత్రుతు మెత్రన కాలమత్రుల పేరిఁటి వేల్పుతాలఁ గో
ల్పురహిపహించి గట్టుపయిఁ జుట్టునుఁ బుట్టిన ప్రాకు లాకులున్
విరులును బువ్వుఁదేనియలు వెండియుఁ బండులు రాల్చు మెండుగన్॥

ఉ॥ తమ్ముల గుంపునందలి రుగ్మముల పెంపున శీతవాతపో
తమ్ముల పంపున నత్రధుష్పృతమూత్రలగింపు ననంగునంపమొ
త్తమ్ముల సొంపున స్పహంగతముత్రలముంపున నీదు హంసజా
తమ్ముల తెంపునం బలుకతమ్ములనింపు నయించుఁ గూడిక్రీకన్॥

సీ॥ జిగినాఁచు దీఁగలు చిగురుదర్భలు గాఁగ నలిననాళములింధనములు గాఁగ
ఫుల్లరక్తాంబుజంబులు నిప్పుకలు గాఁగ ఘనకేసరంబు లక్షతలు గాఁగ
మనుగ సపూరంబు మధురాజ్యధారగా మధుకరరాజి ధూమంబు గాఁగఁ
దీరభూజములు బుత్విగ్జనంబులు గాఁగఁ దక్షగధ్వనులు మంత్రములు గాఁగఁ
దమిత్ర మొగ్గలు బలుయూపదారువులుగ । మనత్ర థాధ్వరి గావించు మానినీజ
నాతిమానాశ్వమేధమహాధ్వరంపు । గొలవనుతెలంపు వింపు నక్కొలకుసాం

క॥ క్రమమత్స్యకూగత్రరేఖో । ద్గమసంతుల కంకణోదిత్ర కాశ్రీకరమై
కమలాకర మోయనఁద । త్కమలాకరమొప్పు విమలకమలాకరమై॥

చ॥ భువనధురీణతాయుతనభోగజుతస్థితియై కవీద్వర
బ్దరివృతిసాంద్రపాకలనభాసిలి దృక్ప్రతిభావభావ్యమై
మరిశరదమై రసాతలముశోభిలఁజేయుచుఁబద్మలోచనా
నవరతశయ్యగా నది యనంతవిలాసముఁజూపు నెంతయున్॥ 85

సీ॥ సమ్యక్ప్రసాదవత్సరసభావంబున ఘనమధుపాటనాళిలవవలనఁ
బ్రబల గాంభీర్యధారంధర్యసంగతి మహనీయభువనసంభరణగరిమ
మత్స్యకూర్మాదిసంభవహేతుకస్థితిఁ గువలయవిలసనాకుంతమహిమ
సంతాపమునదంచుచల్లఁదనంబున నాశ్రితసులభమై యమృతమిడుట
నౌత్యమువహించియు నదంచితద్విరేఫ। శబ్దలక్ష్మీత్రిద్యదమితాబ్జసముదయాస్ప
దత్వగౌరవమున మీఱుదానవారి। మానసము నేమనఁగవచ్చు దానిసొబగు॥ 86

చ॥ అరుణకరోత్కరారుణ హుమాంచల చంచల చంచరీక సం
చరణసమంచితామ్రతరు సంచయముల్ జలబింబితంబులై
పరఁగుఁదదీయతీరమున వహ్నిశిఖాటి ముపర్యధోముఖ
స్ఫురణము నేఁటికిందనుచుఁ జూపరులబ్బురమందిచూడఁగన్॥ 87

ఉ॥ మీఁదుగఁబాదముల్ వఱపి మేదిని నాదలలూఁచి మాధవై
కోదయ సాదరాత్మక వనోదరమందు జపించువారిగా
నాదరిసున్నయున్నతనురాగములం గమలాకరప్రస
న్నోదకమందుఁజూచి చెలియొక్కతె మ్రొక్కఁగ నవ్వెరందఱున్॥ 88

జలక్రీడాదిప్రశంస.

శా॥ రాసక్రీడలఁజేడెలందనిపి యా రాజీవనేత్రుండు పే
రాసన్ వారివిహారముల్ సలిపి విద్యచ్చంద్రికాసాంద్రధా
రాసంపాతసుశీతసైకతములన్ రాజాస్యలంగూడి యా
రాసంభోగమువర్చె నష్టలితుఁడై ప్రత్యేకరూపంబులన్॥ 89

గోపీసంశయవిచ్ఛేదము.

సీ॥ తత్త్వజ్ఞులక్షలితబ్రహ్మచారిగా విచ్చకంబాడుదు రింతకాని
యిందఱితోఁగృష్ణుఁడిట్లురమింపుచు నష్టలితుండెట్లు కానటంచు
నగుమగువలకెల్ల నమిత్రకృట్టుట కొకరేయి మఱ్ఱాఁటుచుగ్రుఁడగుచు
నాకొంటివన్నముల్ దేవున్నకపియుంగుననిరి యమునాపారమందు మెఱయు
యమునదాఁటి రాఁగ నసమర్థలై వారు। పన్నినట్లచేసి యన్నములిడి
కృష్ణుఁడష్టలితుఁడు బుషిశశ్వదుపవాసి। యనుచునమిత్రవేఁడుకొనిరివారి॥ 90

## గంధర్వ శాపవిమోచనము.

మ॥ నగముఖ్యాంగిరసుల్ సురూపులని గంధర్వుండు వారల్ శపిం
పఁగఁ బామై యిటనందు గ్రుంగె హరి యొంపం దొంటి రూపంబుతో
గగనంబంటి సుదర్శనుండను భవత్కారుణ్య సంపత్తిచేఁ
దగె మచ్ఛాపమటంచు మ్రొక్కి చనియెన్ దేదీప్యమానాకృతిన్ ॥ 91

## శంఖచూడచూడామణి హరణము.

కొనకొని శంఖచూడుఁడను గుహ్యకుఁ డొక్కవిలాసవేళ వ
ల్లనచని వల్లవీజనములంగొని పాఱఁగ శౌరి సీరితో
వెనుచని చీరి వారి విడిపించుచు వానివధించి తన్మణిం
గొని చనుదెంచి యిచ్చెనిట గోపికలంగని కాచుసీరికిన్ ॥ 92

## కపిద్థాసుర (కాలకవికుల) సంహారము.

సీ॥ బలియున్నయగు కాలకవియాసురక్కసి వెక్కసముగనిక్కి వెలఁగయగుచు
వెలిఁగె నబ్బలియుని బలగముకంటకతరువులై పెరివె నాతనిసహస్ర
సుతపతులగు సప్తసుతులు గోమూర్తులై ఘటతుల్య తత్ఫలచ్ఛటలఁదినుచు
బలిసిరిందఱును దత్ఫలవిషవాతంబు లాభీరగోనివహార్తిఁజేయ
శంభుఁగొల్చి తత్ప్రేషితశంఖకర్ణ । భూతవరవశ విధివాక్యముల నెఱింగి
సీరితోశౌరిచనివారిఁ జీల్చి కాల్చి । మనిచె గోగోపకుల నిరామయులఁజేసి ॥ 93

## వృషభాసుర సంహారము.

మ॥ వృషభంబౌచు నరిష్టనేమియను దైత్యేంద్రుండు దీంద్రించి గో
వృషముల్ గొందలమంద మందపయిఁ బర్వెం బర్వఁ బర్వేందుఁడు
నిశితధ్వాంతమునట్లడంచె నవుడాసీరజ నేత్రుండు త
ద్విషమాకార విషాణమూడ్చి యదియే దివ్యాస్త్రమై తోడ్పడన్ ॥ 94

## కేశి సంహారము.

క॥ శైశవమునఁ గేశవుఁడ । క్లేశంబున నీసడించి కేశియు నాడు నా
కేశవిరోధ్యనదఁచిలో । కేశవినుతిఁ గాంచె వశమయిడి శిశువులకున్ ॥ 95

## కేశి ప్రలంబ వత్స బకాసురుల పూర్వవృత్తాంతము.

సీ॥ గంధమాదనమున గంధవాహాఖ్య గంధర్వతపస్వికి నందనులయి
తగు సుదర్శన సుహోత్ర సుదేవులును సుపార్శ్వుఁడును దుర్వాస శిష్యులయి
యోగబలమున రాధేశపార్శ్వతులై పదత్రిపూజనిత్య వ్రతంబుగఁ దదర్థ
ముమకొలనికిఁబోయి కమలముల్ గోయుచు శివపృష్ఠులైతమ చెఱ్వుఁదెల్పఁ
జిత్రసరసికిమున్నున్న శివునియాన । దప్పదని కృష్ణుఁడై వారితలఁపుఁదీర్చి
శివుఁడు విడువంగవారకేశి ప్రలంబ । వత్సబకదైత్యులై ముక్తిఁ బడసిరపుడు ॥ 96

## వ్యోమాసుర సంహారము.

మ॥ ఇటులశ్వంబగు కేశిఁ జంపి యటుపైఁ గృష్ణుండు గోపాలితో
నటవింటాఁగిలిమ్రూఁతలాడు నెడ వ్యోమాఖ్యాసురుండర్భకుం
డటులై యాటమిషన్ గభీరగుహలో నాభీరులన్ దాచి స
త్కుటిలుం ద్రుంచి గుహాగతార్భకుల దోడ్కొంచుం జనెన్ మందకున్ ॥ 97

## మాతులాహ్వానము.

సీ॥ వినుఁడు నారదుఁడు కంసునకుఁ గృష్ణ ప్రశంసయునుఁ గృష్ణునకుఁ గంస ప్రశంస
యును దెల్పు వినికంసుఁ డుగ్రుఁడై వసుదేవు వధకరా వారించె నారదుండు
పిమ్మట నక్రూరుఁ బిలిచి పిమ్మటలచందము లెల్లఁ జెప్పి బృందావనమున
కిప్పుడ నీవేగి యప్పనంబులఁ గొని రామకృష్ణుల ధనుర్యాగమునకుఁ
దోడుకొని రమ్మ తన నతండు గూడదనుచు। నెంత చెప్పిన వినకున్న నీశ్వరాజ్ఞఁ
ద్రోయరాదని మొఱఁగి యక్రూరుఁ డరిగి। రమ్మ నగఁ బోయి రాచరిత్రముల వినుఁడు

## దివ్యరూప పరివర్ణనము.

మ॥ యమునం దాఁటి రథాధిరూఢులయి వారక్రూరు నీక్షింపఁ దో
యమునం గ్రుంగుచు నీటఁ బైట నొక ఛాయం గాంచె శ్రీకృష్ణ కా
యము నంతన్ భ్రమ దీరమున్గి యతఁ డాయ్యం బావరాళయ్యౌ నా
య్యమునన్ వర్తిలుమూర్తిఁ గన్గొను వెరంగై మ్రొక్కి ధ్యానింపుచున్ ॥ 99

సీ॥ మలనూని విలువోవి నలుపూని చెలువారు పులిగోరు తీరు కన్బొమలవాని
తొలిగుండు తలపుండు వలనిండు వెలమించుఁ గిరురించు తెలిబొమిడికమువాని
కటితాల సరిగాలు నెతిచాలు నెతిచాలు గదిరెదు కుదురైనదురువాని
కొలగాని మెఱుఁగాని నెత్తితూవికంబుల సందమా హెుంబాజుబందువాని
తెలిపాలుమాకేని మానికంబుల జగాని। గారమొగిఁ గేరి జిగిదేరి మీఱునాసనల
వడకువిడిని వ్వటిల్లు మవ్వంపు దివ్య। చొక్కమొకచక్కఁ జేర్చు చేర్చుక్కవాని ॥ 100

## దివ్యరూప వర్ణనము.

సీ॥ అంగదప్రాంగదలంగదలంకించు చౌలంగదముల నెసంగువాని
మురిపెంపు సిరిపెంపు నరహింపు రతనంపు పేరు పేఱురమున మీఱువాని
మురుగుల్ తొఱుంగుటుంగరములుం గరములం గరమలంకృతులు గాఁ గలుఁగువానిఁ
జెను మించులను మించు పికిలి పించెపుఁ గుచ్చు ద్రేలాడు మొలత్రాడు వెలయువాని
తళుకుమగటాలుఁ దోగటాలుఁ దమ్మిటాలుఁ। బుగ్గదోరటాలుఁ గతిటాలుఁ బ్రొద్దు
[టాలుఁ
దాదొరలటాలు నెలటాలుఁ దలుపుటాలుఁ గలుఁగు మొక్కం దనపుటంబెల
[illegible]॥ 101

సీ॥ అలసోఁపెఁగుల జొంపముల పెంపుదలనొంపఁగల సొంపుగలనాసఁ గలుఁగువానిఁ
గురువిందములఁ గెంపుటరవిందములఁ బెంపుఁదొలఁగింపు మోవినవ్వులయువానిఁ
గ్రమవృత్తసమచిత్తజమహాత్తరనిషంగకమనీయ జంఘాయుగంబువాని
వెలిదముత్తెల మదముత్త వెలిజిముత్తె చెలువముత్తె గలనిదువాలుకన్నులవాని
నిడుభుజంబులవాని నుందొడలవాని । నొగులఁదఁచువాని గూఢజానువులవాని
తెలిడెడువానిచక్కని మేనువాని । శ్రీరమాజానినపుడు దర్శించివచ్చి॥ 102

చ॥ నునువినుచూలి మేఁతపయినూలొక్కని సిబ్బెపులిబ్బి ప్రబ్బుబో
టి పెరుగు మేలిత్రుటారవు కడిందియనుంగున గొప్పనొప్పఁ జా
లినకొనగోటఁ జిక్కవెడలింపుచునింపుగఁ బాలవెల్లియం
దు పెగడుచున్న నిన్నుఁదలఁతుమ్ మురమర్దన శ్రీజనార్దనా॥ 103

ఉ॥ ఈనదిలో మునింగి భవదీక్షణతృష్ణుఁడనై భజించితిన్
మానసికార్చనార్చితసుమంబులె నీపయినుంటఁగంటి ని
క్లైనివుడీ వెఱుంగనటు లేమిగనంబడెనీట నంటివో
దీనశరణ్య కృష్ణ భవదీయమహత్వ మెఱుంగ శక్యమే॥ 104

శా॥ దేవా కృష్ణుఁడు వాసుదేవుఁడని మూర్తిస్ఫూర్తి వీక్షించి యా
జీవుల్ గొల్లడవంద్రుగాని నిజమీక్షింపన్ జగత్కుక్షివే
కావే కావవె భావవేళ్తమున నీకల్యాణరూపంబు స
ర్వావస్థావసరంబులన్నిలిపి మాయంబాయఁగాఁ జేయవే॥ 105

## అమారిరస్తవము.

స్రగ్ధర॥ శ్రీకంఠుండే నేవ్యుం డంచుం జెప్పన్ వేదశ్రేణుల్ దొల్తన్
వైకుంఠుండే వంద్యుండంచుం వాదించుం దర్వాతన్ దామే
యేకాకారంబే బ్రహ్మంబా నీమూర్తుల్ దానేయానంచున్
నాకుందోఁచున్ నామాకారానందార్థం బీనాల్యయంబొటన్॥ 106

సీ॥ అనుదినమును నినుమనమునఁగనుఁగొను మనుజుని వెనుకొని మునుతుపనుచు
వినుపెడఁ గనుపెడఁ జనుపెడఁ దినుపెడ నను పెడ ననువిడ కెపయుమనుచుఁ
దెలిసియుఁదెలియక సలిపిన కలుషము లయుతములయినను సేయిపుమనుచుఁ
బనుల కొలఁది పలుతనువులనొసఁగిన నలయక తలఁపున మెలఁగుమనుచు
బహుళసుఖముల నిహమునఁ బరమపదము చరమగతినిదుమని నినుగరిమఁగొలుతుఁ
గరముఁగనికరమున మదిగరుగనభయకరము శిరముననిడుమిక పరమపురుష॥ 107

ల॥ ఇలయుజలమనలయుజ చలి కెలవుగగనమున గలసకలజగముల నుదలఁపున నెసల్పన్
నిలుపఁబురికొలుపఁదరిఁ గలపమటియుతరులకుఁ బలుమఱునుగనఁబడక ఫలముల
[నొసంగన్॥
బలుపగలయువరరణములనవనిఁగనఁబడియుఁ బలిఁ [illegible] బడలిమహిమలను జెలు
[వొందన్॥

దోలుబ్బలుకుశోనలఁగన సులభముగఁగనఁబడఁగ వలతివయి వెలయూనిమ్ముఁగొలుతుఁ
[బరమాత్మ॥ 108

ల॥ జననియును జనకుఁడును తనయులును సహజులును ధనము పరిజనము గురుజనము
[మఱిసివే
యును మమతఁగను చున్నవి విశు చున్నమమతు చుమని విన్నయమున నయమునను మనవి
[యొనరింతు నో
వినతులయి వినుతులను ననుదనుపునవదలను మనుతున్నదినము నెదు ఘనమగు
[ప్రతిజ్ఞ నో
గనికరము గనికరము మనమునను బెనఁగొనఁగఁ గనుఁగొనుమునవుఁగొనుము వినుము
[పరమాత్మ॥ 109

ల॥ సురపతియు శుచియముఁడు నిర్ఋతియును వరుణుఁడును గరుపలియుఁ ధనదుఁడును
[హరుఁడును మొదల్గాఁ
బరఁగు సురవరులయినఁ గరము భవదఖిలగుణ గరిమలవమయినఁ దెలి యరని శ్రుతి
[పల్కఁగా
గరము దరభరణ మొకపరమ గతి యను మధవశరధిఁ బడిమునుఁగుచును దరిగనక నానా
దురితములఁ నిరతమును జరితములఁ గనఁబడెదు నరులకది దెలియుటకుఁ
[దర మొకొ రమాత్మ॥ 110

ఉ॥ అండజయాన కుండలిశయాన భయానక భండనారి రా
క్షండన యక్ష్వాకాండ నవ కౌస్తుభ మండన రక్షితాశ్రితా
ఖండల గండలంబి శశిఖండ లసన్మణి కుండలా ప్రస
న్నాండవు గమ్మ చక్రధర నూత్న విభాస్వ రవీందుతుండలా॥ 111

ఉ॥ తావక సేవ తావళిఁ దద్దయు నెద్దియునైన భావుకా
భావము గల్గునే వివిధ భావములంగన నీదు పాదరా
జీవము లాశ్రయించె నిజచిత్తము గావున నిబ్భయంబు వే
వే విదళించి కావఁగదవే యవినశ్వర భార్గవీశ్వరా॥ 112

క॥ అని యాగలిదినతుండై । వినుతింపుచు మధురఁ జేరి వెన్నుఁడు దనతోఁ
దనయుంటికిప్పుడేవ । మ్మనఁగంసుని మొత్తి వత్తుమని పుత్తెంచెన్॥ 113

## రజక సంహారము.

ఉ॥ అంతదినాంతమయ్యె నరకాంతకుఁడుం బురకాంతలెంతయున్
వింతగఁ జూడ సంతసిల విప్రులు మెచ్చులఁ బూజ సేగ న
ప్పొంత నవద్యుమున్ రజకుఁ బుట్టములిమ్మన నీమి నా మిమున్
గొంతుక నాక్క్రోక్క రాచకుండగు బట్టలు గట్టఁగనే కాదన్॥ 114

## కువింద రక్షణము.

క॥ [illegible] వింపుఁజసుడు గో
విందునకు మేనివలువలుఁ । గుందనపుందొడవు లిచ్చి కొనె నిప్పిరమున్॥ 115

### సుధామసంరక్షణము.

క॥ దామోదరసన్నిధిలోఁ । దామోదరసంభృతకసుదాముఁడు సుముఖో
దామసుతులనిడికృష్ణుస । తామసుతులఁ బ్రోవుమనఁగ దయానిధి యొసఁగెన్॥

### కుబ్జావనము.

క॥ మయ్యాయుదీపులం దన । యొయ్యారపునడలగెలువనోపు నయారే
యియ్యంగనాశిరోమణి । లియ్యాని విలుకాని జాఁత్రితీకాదుగదా॥ 117

గీ॥ అనుచుఁజయ్యన వౌరుతయ్యంగనంగ । ఘంగొనియభంగకౌతుకరంగదంత
రంగుఁడై భక్తసుప్రాంగిమంగళాకర । వచనరచనలఁ బొగడునట్టి చిరముగను॥ 118

మ॥ అనులేపంబులు గోరికైకొని త్రివక్రాకారయౌ కుబ్జనా
క్కా నిమేషంబునఁ జక్కనైనవనితం గావింపఁగా విశ్వమో
హనమూర్తిం దనఁగాంచి పంచశరవీరార్తిన్ నివర్తింపఁ జే
సి ననుం బ్రోవుమటన్న వత్తునని యే చేరెన్ ధనుశ్శాలకున్॥ 119

### కంసకార్ముకఖండనము.

ఉ॥ చేరి గజారికార్ముకముఁ శ్రీరఘురాముఁడు చీఁకుటీరునన్
శౌరి నిజారికార్ముకముఁ జయ్యన బ్రయ్యలు జేసి తానునా
సీరియుఁ రెండుఖండములు చేకొని దండ్యులఁ జెండి వల్లవా
గారమునందు భోజనసుఖస్వపనంబులు దీర్చి వేకువన్॥ 120

### సూర్యోదయవర్ణనము.

మ॥ తొలిడాల్కట్టియఁ బట్టి తూర్పుచెలి కందున్ జక్కటా కాన్కఁగా
నెలపానేత్రికులబుటికి గాఁగొనిన పెన్నేచెంచితన్ మిఁటియం
దలిపొద్దుందొడవూడ్చు చొప్పడుగఁ జెంతం దండ్రి నేరంబెటం
గిలి లలిఁ జీఁకటి సంజకుట్టగమిడాఁగంగానలం దెల్లెడన్॥ 121

### కంససంహారము.

మ॥ బకవిద్వేషి ప్రభాతకృత్యముల నిర్వర్తించి కంసద్విపుం
బెకలింపంజన నడ్డమైకువలయాపీడంబు పీడింప నో
డక బల్వేదుక శ్లోడఁ బోరి శిరమూడంగొట్టి చాణూరము
ష్టికులం జంపి నృశంసుఁ గంసుఁడుని మెట్టి శీర్షప్రహారంబులన్॥ 122

### కంసజన్మకారణప్రశంస.

సీ॥ ఒకబుతుకాలమందుగ్రసేనునిరాణి యామునతటిని సుయామునతటి
నిష్టవిహారసంతుష్టయై చెలులతో మెలఁగుమఁదోల్కారి మెలపుటొఱపు

మథురాపురప్రవేశము. కుబ్జామనోరథపూరణము.

మ॥ తదనుజ్ఞంగొనివచ్చుచున్ మధుర చెంతం బాంచజన్యస్వనం
బొదవింపందమరాతిగాఁదలఁచి స్వీయుల్ జాయుధ్వంద్వప్రవా
హ దృగానంద మొనర్చి కృష్ణుఁడు యశోదానంద గోపీహృద్య
ద్ దయుండెల్లఁగ నుద్ధవుంబనిచి కుబ్జాకాంక్షఁదీర్చెందమిన్ ॥ 129

సృగాలసంహారము.

మ॥ జలదాభద్యుతుఁడై తొలంగిన జరాసంధున్ విసర్జించి సే
నలతోడన్ దమఘోషుఁడచ్యుతుని కంఠంజేరి ప్రేరేఁచఁగా
హరితోనేఁగి సృగాలుఁగూల్చి తదీయ శ్రీలు ప్రార్థింపఁగా
నిలిపెందత్కర వీరపట్టణమునన్ నెన్నందు తన్నందనున్॥ 130

జరాసంధయుద్ధము.

సీ॥ పితృవియోగమునశోకాతులైరిపాండవుల్ప్రసకాంత్రిదిభుఁడంధుఁడదనితనయుఁ
డలిమదాంధుఁడుకుంతి మతులెట్లు రైయుండిరోయని కనుటకక్రూరుఁబనిచి
జిగిమిషుఁడైయుండ జగమెషువులఁ జెండఁదగినంత సేనతో మగధనేత
దనకుఁబుత్త్రికలుకంటునకుఁ బన్నులైనయస్తియుఁ బ్రాప్తియుఁగస్తివడఁగ
మిట్టిపడిమధురాపురిముట్టడింప । రామకృష్ణులు వారియుర్వ్యాదియమరాఁడు
సైనయక్షోహిణులఁగొట్టివానిఁబట్టి । యుసువిడిచిపెట్టిరామీఁదివసులఁబట్టి॥

కాలయవనహననము.

సీ॥ మఱియుఁజరాసంధుఁడెత్తెఁగి యెత్తిగియుఁ బదునేడు మాఱులీరీతిఁగాంచి
పదునెనిమిదవ మాఱి బయలుదేరుటకు సన్నద్ధుఁడౌనంతలో నారదుండు
హరిపల్పుతులఁ దెల్పిప్రేరేఁపఁగా దగ్గయవనుండుముఁడుకోట్ల
యవనసైనికులతో నవనియానినచందమునమధురాపురిముట్టడింప
గృష్ణుఁడఖిలజ్ఞుఁడగుటచే ఫృష్టుఁడైని । రాయుధుంతయిరాఁగనియవేఁడు దఱుమ
హరియుఁగిరిగుహఁజొరఁగవాఁడరిగిహరిగెఁ । దలఁచియందున్నముచికుందుఁడగ్నిఁ జెప్పె॥

కాలయవనజన్మవృత్తాంతము.

సీ॥ యాదవుల్లమగొల్లవగునన్న నమ్మఁడు పరిహాసించియతండు పక్షతిగాక
పురుషుఁడేయనితమవ్రాల్ఁ శ్రీగఁగమెండు మిన్నకుండిరటంచుమిగులఁబొగిలి
యదుకులభీకరుండగుసుతుఁగోరి శంకరుంజేఁదుబట్టుపిండిదినుచుండి
ఘనతపమొనరింపఁగరుణించి భర్గుఁడు గర్గుండడిగినట్టికలుగువరముఁగ
వారఁడచ్చరయుండుఁగన్నట్టిసుతుని । యవనపతి పెంచెరనకార్యమువలనసేఁగ
వారఁడే కాలయవనుఁడౌనని మచుకుందుఁ, డెంచియుఁ బెకుందుచేతమ్రెండించెనిట్టు॥

వాసుదేవ ప్రభావప్రశంస.

చ॥ హరిగరిమంబెఱుంగఁ దరమా పరమాత్ముఁడతండు నేఁడు భూ
భరము హరింపఁ గృష్ణుఁడయి భక్తులఁ బ్రోచుచుఁ బాపయుక్తులం
బోరిఁ గొనుచున్నవాఁడు వెలుపల్ మఱుపల్ గలవాఁడు గాదు భం
గురమతులెట్టులన్న ముచికుందరిరక్షణ నర్చనీక్రియన్॥ 134

ముచికుందచరిత్రము.

సీ॥ ముచికుందుని చరిత్రము వినుఁ డతండు మాంధాతృపుత్త్రుండు దేవతాహితార్థి
వాసవప్రార్థితుండై సమరములందు నసురులను జయంబున మరఁ జేసి
సురలు ప్రసన్నులై వరమీఁ దలంచినఁ దనవాంఛ నేమి నిద్రను వరించి
లేపినవానిఁ గూల్చెద నంచుఁ బన్నంట హరి యెఱుంగును గాన నతని నిపుడు
మేలుకొల్పుట కిరీటిఁ గేలుఁ గొల్పి। స్వాజ్ఞ చే విశ్వకర్మ మున్నద్భుతవ్య
మున సృజించిన ద్వారకాపురికిఁ జేర్చె। యోగమహిమను మధురలోనున్న జనుల॥

క॥ వీక్షించుచు ముచికుందుఁడు। పేక్షింపక మోక్షమును బేక్షింపఁ గృపన్
రక్షింపనున్న జలదా। క్షాత్రుని టాల్ భాగడఁ దోడఁ గనఁ దానతుఁడై॥ 136

ముచికుందస్తవము. బాలకృష్ణస్తవము.

శా॥ శ్రీనందప్రియనందనుండవగుచున్ వ్రేపల్లెలోఁ బుట్టి నీ
వానందప్రియమూర్తివై తివిరి నీయాకారమే కారణం
బైన నూత్నలము చేసి కన్పఱచి నన్నానందమొందింపుమీ
నానాతుంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 137

శా॥ నేనీ వాఁడనటంటి వేఁడుకొనుచుంటిం బ్రోవుచుంటిం గృపన్
నా నేరంబులు సైపుచుంటి భవసంతానంబు నే నోర్వఁగా
లేనంటిన్ నినువంటి వేల్పులెవరున్ లేరంటి రక్షింపుమీ
నానాతుంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 138

శా॥ నేనే కార్యముఁ జేయుచున్న నది నీ నిశ్చార్యగాఁ జూచి నా
దీనత్వంబెడఁ బ్రోచి కేవల కృపాదేదీప్యమానుండవై
నానందంబెందఁగనీక యీవరద నిత్యానంద మొందింపుమీ
నానాతుంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 139

శా॥ జ్ఞానంబించుకయైన లేనికతనన్ సంసారసౌఖ్యంబులన్
మానంజాలఁగనైతి బట్టులయినన్ దుర్వారపుణ్యంబునన్
నీనామస్మరణంబు గల్గె నికఁ దానిన్ నిల్పి రక్షింపుమీ
నానాతుంగళ సంఘసంఘటన కృష్ణా బాలకృష్ణా హరీ॥ 140

శా॥ నీ నాభీకమలంబునం బొడమి వాణీభర్త నీతత్త్వమిం
తైనం గన్గానఁజాలఁడయ్యె నసఁగా నస్మాదృశాత్యంతమూ
ఢానీకంబు గనుంగొనంగలదె ప్రత్యక్షంబవై యేలుమీ
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 141

శా॥ సూనుం డెంతటి నేరపోతయిన సంక్షోభంబు లేకుండుచుం
దానం దండ్రి సహించి ప్రోచుకరణిన్ నా నేరముల్ సైచి నీ
యానం ద్రిప్పియెసంగు మైహికసుఖం బాముష్మికానందమున్
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 142

శా॥ విశ్వంబంతయు నీవుగాఁగనుచు ధీవిన్నిన్ను సేవించు వా
రైశ్వర్యంబిహమందునొంది పరమందైక్యంబుఁ బ్రాపింతుర
న్విశ్వాసంబునఁ దత్ఫలార్థినగుచు న్నిన్గొల్చుచుంటిం జుమీ
శశ్వన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 143

శా॥ అక్షుల్నిన్గనునట్లు హస్తములు నిన్నర్చించునట్లాత్మ ని
న్నక్షీణంబుగ నమ్మునట్లు చెవి నిన్నాలించునట్లాస్యమున్
చీకున్ నిన్గొనియాడునట్లు కరుణన్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 144

మ॥ సుగతింగోరుదుఁగాని యేసుకృతమెచ్చోనైనఁ జేయంగ నై
తి గజేంద్రస్థితి వింటి నిన్గొలుచుచుంటిం బారతంత్ర్యంబుచే
త గుఱిందప్పించరించుచుంటి నయినం దాసుండ నైతిం జుమీ
జగతీమంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 145

మ॥ మును నీసన్నిధిఁ దక్కఁ దక్కినఫలంబుల్ పుట్టుచుం గిట్టుచుం
గనుఁగొంటిం గనుఁగొంచునుంటి నిటపైఁ గారుణ్యమే పారఁగా
ననునీసన్నిధిఁ జేర్చుకొమ్మిదె సుమీ నాప్రార్థనీయంబు స
జ్జనతామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 146

క॥ చనువుననింతియనా కో । రినయది నీవింతమాత్ర గృపసేయఁగదే
వినతాశ్రితవనచైత్రా । వినతాసుతపత్ర వేదవినుతచరిత్రా॥ 147

క॥ అని యీగతి వినయాగతిఁ । దనరారఁగ భక్తియుక్తితత్పరుఁడగుచున్
వనజాక్షుని వినుతించిన । జనితానందమున సుప్రసన్నుండగుచున్॥ 148

ముచికుంద వరప్రదానాదిప్రశంస.

ఉ॥ కోరి ముకుందుఁడట్లు ముచికుందునకున్ వరమిచ్చి వచ్చి, కాం

తారములీలఁగాలయవనప్లుతనం జతనంబులేక డా
సీరియు నేకమై తునిమి శ్రీమథురా ధనధాన్యసంపదల్
వారక ద్వారకాపురికిఁ బంపజనుల్గొని పోవుచుండఁగాన్॥ 149

### శ్రీద్వారకాపుర ప్రవేశము-

సీ॥ అంత జరాసంధుఁడంతక నిభసైన్యములతోడమథురనుముట్టడించి
రామకృష్ణులు ప్రవర్షణగిరిశిఖరంబునకుఁ బోవుటరసి వెక్కదవిలివారి
మతమెఱుంగకభయంపడిమలుపడిరని బ్రమసివారిదహించువాఁడుబోలె
నగ్గిరి డగ్గరి యగ్గి రవుల్గాల్చి ప్రుగ్గిరి వారని మరలి పోయెఁ
బదునాకండామడలపొడవెటఁగియున్న । యున్నతగ్రావశిఖరంబునుండి హరియు
హలియునింతకుమున్నె సైన్యములవెలికి। దాఁటిద్వారకఁజేరి రత్యద్భుతముగ॥

### శ్రీమథురాక్షేత్ర మాహాత్మ్యము-

శా॥ శ్రీకృష్ణాభ్యుదయంబునన్ మథురయే క్షేత్రోత్తమంబౌచు నా
రా కాశ్యాదులకన్న జన్మమరణ బ్రహ్మోపదేశాంగదా
హాకార క్రియలంజతుర్విధముగా నైక్యప్రదంబౌచు ను
ద్రేకించెన్ మహిమంబునన్ జతురశీతిక్రోశమధ్యంబునన్॥ 151

### శ్రీద్వారకాపుర వర్ణము-

శా॥ మున్నింద్రాదిపురంబులెల్లఁ దనకూర్పున్నేర్పు రాజిల్లనో
జన్నిర్మించిన విశ్వకర్మ హరియాజ్ఞం జేర్మి నిర్మించె న
మ్మాన్సస్ని రంతరమిచ్చె లక్ష్మికదియే పుట్టిల్లునట్టిల్లుఁజెం
పెన్నన్ ద్వాదశయోజనంబులు తరంబే ద్వారకంబేర్కొనన్। 152

సీ॥ అకలంకనిత్యపూర్ణకలావిరాజిత ద్విజరాజరాజిప్రదీపితంబు
సంతతక్రతువృద్ధిసంపాదనానుగ్రరాజావతంస విరాజితంబు
మిత్రసంప్రీణనస్తోత్రపాత్ర నిధీశపుణ్యజనార్యవిస్ఫూర్జితంబు
సఫలహలక్రియాసంపూర్ణబలభద్రశూద్రవర్ణబలాభిశోభితంబు
విబుధకులవృద్ధి శైత్యవర్ధి శుభస। మృద్ధి పుణ్యాభివృద్ధి జడేతరర్ధి
శుద్ధి ధనవృద్ధి బహుముఖసిద్ధి విజత। సురవరపురంబు ద్వారకాపురవరంబు॥

చ॥ లలనలు తత్పురీ దయితులం దమిఁగాఁగిటఁజేర్చిచంద్రశా
లల నలువొంద మాన్ రతివిలాసి జయించుటకేఁగి వారి లీ
లల నలలోచనప్రతిఁ జెలంగఁగనుంగొని భీతినిండ్లగో

లలనలు దిక్కులన్ విడుచు లక్షణముం దెలుపున్ వెడల్వరుల్॥ 154

చ॥ తనరు హరిన్నభంబులను ద్వార వితానములొంది చిల్వతేఁ
డను నెలతాల కంబమున నందము నొందుచునున్న భూతలం
బనియెడు మేడలో నిడిన యాతత దర్పణదీపయంత్రమో
యన ఘన ధర్మహర్మ్యసహితాచ్ఛమణీకృతవప్రమప్పురిన్॥ 155

చ॥ తరమె నుతింపఁ గ్లౌమణివితాన వితాన తతానపాయముం
దిరయుచి కౌముదీ ముదిత దివ్యచకోర ముదశ్రుపూర సా
గర సురదీర్ఘికా వలన ఖండితపత్త్రిసరోరుహస్థ బం
భర పణిభోగశాయి హరి పశ్యదశేషసురిన్ మహాపురిన్॥ 156

మ॥ పురమాశాంతరవర్తికీర్తికలశాంభోరాశిరాడంతర
స్ఫురదత్యున్నతవప్రశృంగఘళవిస్ఫూర్జత్సుపర్ణేష్టకో
త్కరబద్ధాలయకాంతిరేఖావిలసత్పద్మాక్షభృంగోజ్జ్వల
ద్ధరిదుర్గాంబుజనాళలీలఁ దగు నుద్యత్కేతనంబప్పురిన్॥ 157

క॥ ఆపుర మున్నతగోపుర। మై పరఁగి పయోరుహాసనాండోర్ధ్వపుటం
బేపున భేదించియు గా। దే పుటభేదనసమాఖ్యఁ దెచ్చెఁ బురులకున్॥ 158

మ॥ వినతానందన విశ్రుతిం దనరుచున్ వేదాత్మకత్వంబునన్
గనుటన్ వ్యాకరణప్రవీణత ననంతఖ్యాతిసంపత్తిచే
మనుటన్ ముప్పదిరెండు నాఁ దనరు సమ్యగ్బ్రహ్మవిద్యల్ గనుం
గొనుటన్ నామము సార్థకంబగుచు వెల్గుం దద్ద్విజశ్రేణికిన్॥ 159

మ॥ నరమాత్రుల్ సొరరాని దోటవలనన్ నానాప్సరోయక్ష కి
న్నర విద్యాధర సిద్ధకింపురుష గంధర్వాదులయ్యోపనుల్
పురిఁ గావించి గడించుచున్న విభవంపుం బెంపు నీక్షించుచున్
హరికర్పింపని నాటి కల్మిగని యక్షాధ్యక్షుఁ డొందుం ద్రపన్॥ 160

శా॥ అన్నాళీకదళాక్షుఁ డన్నిటికి నధ్యక్షుండునుం గారణం
బిన్నానావిధ విష్టప ప్రతతి తత్సృష్టంబు తత్పుష్టముం
దన్నిష్టంబును దద్వినష్టమగుఁ గ్రీడామాత్రమా ప్రౌఢ కే
తన్నిర్మాణభృతి ప్రభృత్యఖిల కృత్యం బెన్న నత్యంతమున్॥ 161

ఇంద్రాద్యమరసమర్పిత తత్తద్వైభవ ప్రశంస-

సీ॥ పారిజాతంబులోఁ బరమాద్భుతంబగు తగుసుధర్మను బురందరుఁ డొసంగె

శ్రవణైకదేశమేచకమనోజవశుక్లవర్ణతురంగముల్వారుణుఁడొసఁగె
వరనామకంబైనవరనిధినాకృటి దక్కఁదక్కిన నిధుల్ధనదుఁడొసఁగెఁ
దక్కినదిక్పతుల్దమకుమున్నీశ్వరుండిచ్చిన సంపదలెల్లనొసఁగి
రిట్టిసంపదలకునెల్లఁబుట్టినిల్లు। నైపరఁగుద్వారకాపురి నధివసించి
హలధరుఁడురేవతిం బెండ్లియాడెఁ గృష్ణుఁ।డష్టమహిషులఁబెండ్లాడెనద్భుతముగ॥

రేవతీ పరిణయము-

సీ॥ కృతయుగమందు రైవతుఁడనురాజురేవతియనఁదగుతనసుతకుఁబెండ్లి
సేయఁదలంచియేతిపతినొల్లక కన్యతో సత్యలోకమునకరుగ
నృపుతలంపువిరించిరోఁటెఱిఁగి యిర్వదియెన్మిదిమహాయుగములుగతించె ద్వాప
రయుగాంతమిపుడయ్యెరాముఁడు కృష్ణాగ్రజుఁడు గాన నర్హుఁడీసుతనొసంగు
మనఁగనాతఁడు ద్వారకకరిగియొరగి। తనతలంపునువ్యాపంపు నెఱిఁగింప
లాంగలంబునఁ గ్రిందికిలాగికుఱుచఁ। జేసి రేవతిఁబెండ్లాడె సీరధరుఁడు॥

అష్టమహిషీకల్యాణ ప్రశంస.

౧- శ్రీరుక్మిణీ కల్యాణము.

సీ॥ శ్రీశాద్భృతి విదర్భదేశాధిపతిభీష్మకుండు కుండినపురి నుండునాత
నికి రమాంశమునజనించిన రుక్మిణియందుఁగృష్ణుఁడుఁ గృష్ణునందురుక్మి
ణియుఁబరస్పరమోహానిర్మగ్నులౌచుండరుక్మిణినన్నయౌ రుక్మిపూని
శిశుపాలునకొసంగసిద్ధమైయుండుట ద్విజునంపిరుక్మిణిదెల్పకృష్ణుఁ
డరిగిపురశక్తిఁగనఁబోవుటరసియామె। నరదమెక్కించుకొనిపోవ నడ్డుపడినఁ
దలగొఱిగిరుక్మినవలించితరలివచ్చి। యిట్టరుక్మిణిఁబెండ్లాడెఁగృష్ణమూర్తి॥

ద్రౌపదీ స్వయంవర ప్రశంస-

సీ॥ ద్విజవేషమునద్రౌపదీస్వయంవరరంగమునఁ బొల్చుపాండునందనులఁబోల్చి
శౌరి సీరికిఁజూపి జయమొందునేఁడిందు విజయుండనుచుఁదెల్పిస్వజనములను
గదలకుండఁగనిల్పికనుచుండఁ దమకసాధ్యంబైనయంత్రమత్స్యంబుఁ గేసి
యాజ్ఞసేని వరింప నరుగు నరుం గని యెదిరించి యోడిర య్యనసుతాదు
లంతపైఁగొంతికొడుకులయంతికమున। కరిగి లాక్షాగృహవిముక్తులైనమిమ్ముఁ
గంటిమిదిపుణ్యదినమువేల్గల్గుమీకు।టంచువీడ్కొనివచ్చిరిహరియుహలియు॥

౨- జాంబవతీ పరిగ్రహణము-

సీ॥ రవి నిత్యమష్టభారసువర్ణమిడు శమంతకముసత్రాజిత్తునకునొసంగెఁ

దదనుజుండు ప్రసేనుఁ డది దాల్చి వేఁటకుఁ జన వాని సింగంబు దునిమి దానిఁ
గొని దానిఁ దునుమాడి కొని జాంబవంతుఁ డీకృత్యమెల్లను దనదేయటన్న
నింద చతుర్థి నాఁ డిందునిఁ దాఁ గన్న ఫలమని కృష్ణుండు దలఁచి వెలుచ
నడుగుజాడను గుహఁ జొచ్చి యచట జాంబవంతుతోఁ బోరి యాతని వరము దీర్చి
మణిని జాంబవతిం గొని మరలి వచ్చి। మణి నతని కిచ్చి తననింద మాన్పుకొనియె॥

క॥ వాపోపడఁ జూపోపని। పాపోప నిబద్ధులకట పటుకటుచటుల
వ్యాపారం బేపారఁగ। లాపనలం బన్నుచుం బ్రలాపించిరిగా॥ 167

## ౩. సాత్రాజితీ వివాహము.

సీ॥ హరిగోరినప్పుడీనైతి నూరకనింద మోపితి నతనికైఁ బాపినైతి
ననుచుఁ బశ్చాత్తప్తుఁ డగుచు సత్రాజిత్తు మణితోడ సత్యభామను సమర్ప
ణము చేయ హరియుఁ గన్యామణిఁ బెండ్లాడి మరల నాతనిక యమ్మణి నొసంగెఁ
డనకిచ్చెద నటన్న తనయ నన్యున కిచ్చెనని శతధన్వుఁ డాతని వధించి
మణిని గొనివచ్చి కృతవర్మ మరుఁగుఁ జొరఁగ। నతఁడు నిరసించె నక్రూరుఁ డట్లుయునఁగ
నతని కడ నుడిచనుచుండ హరి వధించి। మణికి నక్రూరు రావించి మరల నొసఁగె

వ॥ అదియెట్లనిన.

సీ॥ ననునిల్పి శతధన్వుఁ దునిమి శమంతక మపహరించితివి లేదంటివడుగ
శపథముల్ శపథముల్ చాలుఁ జాలు నునమ్మఁ జాల నిన్నని సీరి శౌరి వదలి
మిథిలలో మూఁడేండ్లు మెదలి దుర్యోధనునకుఁ దా గదా కదనంబుఁ గఱపె
నవనదీక్షాకవచ సురక్షితుండౌచుఁ గాశికాపురి నుండెఁ గాందినేయుఁ
డప్రడవగ్రహశాంతి కైయతని నితని। బిలిచి మణిఁ గొని కలుఁ ద్రావు హలధరుండు
నేను స్త్రీలోలుఁడను నీవు నియమశాలి। వందమని గాందినేయునికే యొసంగె॥

## ౪. కాళిందీ కల్యాణము.

సీ॥ పాండుసూనులఁ జూడఁ బుండరీకాక్షుఁ డింద్రప్రస్థపురి కేగి తానునింద్ర
నందనుండును యమునాతటంబున వేఁటలాడుచు నొకకన్యనంతఁ గాంచి
తన్వరింపఁగ నీటఁ దన్వి తపించుట కాళిందియాదిత్యకన్యయగుట
విజయుదౌత్యంబున వినిసంతసిలి తదన్వితము గాఁ దోతెంచి విశ్వకర్మ
వీరిపురిఁ జిత్రతరముగా నింపఁ బంచి। ఖాండవముఁ గ్రాఁచునెడఁ గాచి గాండివాదు
లగ్ని సభ మయుఁ డిడఁ గ్రీడికబ్బఁ జేసి। ద్వారకకు వచ్చి యాశౌరి సుద్వాహమయ్యె।

## ౫. మిత్రవిందా పరిణయము.

సీ॥ అల నవంతిదేశాధీశులైన వింద్యానువిందులు కౌరవాధిపత్య
ధీనులై కృష్ణుని మేనత్తయైన రాజాధిదేవికిఁగడుననుఁగుపట్టి
తమకుఁజెల్లెలునయినగు మిత్రవింద కుద్వాహంబనుచు స్వయంవరము సాటఁ
బనిచిన విని చనివనరుహనయనుండు రారాజు మొదలైన రాజులరయ
నయన విజితారవింద దంతజితకుంద। చికురజితనీలకంద దృగ్జితమిళింద
మిత్రబృందావనానంద మిత్రవింద। నపుడు చేకొనె నృపులంద అలుకఁజెంద॥

## ౬. నాగ్నజితీ పరిణయము.

సీ॥ నగ్నజిత్తనియెడు నామధేయమునఁ గోసలదేశమునకధీశ్వరుఁడు గలఁడు
నాగ్నజితియనం దనర్చు నాతనికన్య యామెను రాజన్యులడుగ రాఁగ
సప్తగోవృషముల సమ్ముఖమ్మున నిల్పి వీనిఁబట్టినవానికీనా సంగు
వాఁడఁగన్య ననంగ వశము గాకందఱు విముఖులై పోవుటవిని చని హరి
సప్తరూపమ్ములై గోవృషములఁబట్టి। గట్టిగాఁగొట్టియీడ్చి పొగడ్త కెక్క-
నాగ్నజితినప్డు పెండ్లాడి నగరికరిగె। నద్దముగవచ్చి వివ్వచ్చుఁడరులఁదునుమ॥

## ౭. భద్రోద్వాహము.

సీ॥ సౌందర్య సౌశీల్య సౌభాగ్య సౌముఖ్యముఖ్య సద్గుణగణాద్భుత సముద్ర
బంధుమిత్రాతిథిపండితకవి భృత్యసాధు దీనార్థిపోషణ వినిద్ర
పతితపాషండ దుర్వ్యాపార పిశునాదిహీనసంభాషణ మౌనముద్ర
భర్తృశుశ్రూషాది పరమధర్మాభ్యాసపాటవతులిత శుంభత్సుభద్ర
మందగమనవినిర్జితమహితభద్ర। పరమపావనచారిత్ర భద్ర భద్ర
మేనమఱఁదలు గావున మేరసెడక। కేకయుఁడొసంగఁ బెండ్లాడెఁ గృష్ణుఁడెలమి॥

## ౮. లక్షణా కల్యాణము.

సీ॥ మద్రాధిపతులకు సద్రాజధానియై పొలుపొందు శాకల్యపురమునందుఁ
దగు బృహత్సేనభూధవశిరోమణికిఁ దులస్యంశమునఁ బుట్టెలక్షణాఖ్య
నొక కన్య-యామాన్య కుద్వాహమొనరింపఁ దొడఁగునప్పుడు నారదుండు వోయి
కృష్ణచర్యలు సంగ్రహించి తెల్పుచుఁ గృష్ణునికిఁ గన్యనిచ్చువానిగ నొనర్చి
కృష్ణుకడకేగి లక్షణాకృతినుతింపఁ। గృష్ణుఁడు స్వయంవరోదంత మెఱిఁగియరిగి
యంత్రమత్స్యము నేసి కన్యనుగ్రహించి। వైరులను గెంటియింట నుద్వాహమయ్యె॥

క॥ కల్యాణుఁ డష్టమహిషీ। కల్యాణకథాభరంబు కర్ణరసజ్ఞా
కుల్యల జాల్కొల్పుచు సా। కల్యమునం గాంచు నిష్టకల్యాణములన్॥ 175

## తీర్థస్నానాభిగమనము.

సీ॥ శౌరి శమంతపంచకతీర్థమునకు సాప్తము గ సూర్యగ్రహణమున కరిగి
స్నానదానాదులు సలిపిన పై యశోదానంద పాండునందన ముఖాప్త
జనులను వేర్వేఱ సముచితరీతిగా సల్లాపములను ల్లసిల్లఁ జేసి
కుంతియు వసుదేవుఁ డెంతయు స్వప్రశంసనొనర్చికొనుటకు సంతసించి
కృష్ణుఁడును గృష్ణముఖులొక్క కేలనుండఁ। గృష్ణయును గృష్ణసతులొక్క కేలనుండి
సరససల్లాపములొనర్చు సమయమందు। నిందతినిజూచి ద్రౌపది యిట్టులనియె॥

శా॥ రాకాచంద్రనిభాస్యలార కనులారం జూడకున్నన్ మనః
ప్రాకామ్యంబు ఫలించునట్లు చెవులారన్ విందు సానందనై
మీకల్యాణచరిత్రఁ దెల్పుఁడనఁ జెల్మిం దెల్పి రాచెల్వలా
జోకన్ లక్షణ దెల్పెఁ దెల్పితినటుల్ సూత్నప్రకారంబులన్॥ 177

## నరకాసుర సంహారము.

సీ॥ నరకాసురుఁడు క్రొవ్వి సురమాతృ కర్ణకుండలములు వరుణు ఛత్రంబు సురల
మణిపర్వతము హరింప నిలింపపతి దీనుఁడై విన్నవింపఁగా హరియు సత్య
భామతో రథ మెక్కి ప్రాగ్జ్యోతిషము జేరి దుర్గసప్తకముఁ దుత్తుమురుఁ జేసి
మురు నైదుశిరములు ధరఁ గూల్చి తత్సప్తనందనుల వధించి నరకుఁ ద్రుంచి
వానిసుతు భగదత్తు సంపన్నుఁ జేసి। ఛత్రకుండలమాలికా చిత్రరత్న
దాత్రియై ధాత్రి వేడఁ దద్వశగ సశత। షోడశసహస్రకన్యలఁ దోడి తెచ్చె।

## సశతషోడశసహస్ర స్త్రీ ప్రశంస.

శా॥ అష్టావక్రుఁడు నీటనిల్చి సురకన్యానృత్తగీతాదులన్
హృష్టుండై హరిపత్నులౌనటు వరంబిచ్చెం దనున్ నవ్వఁగా
రుష్టాత్ముండయి ముక్తిలేక శబరుల్ రోధింప మీ విష్టపం
బిష్టప్రక్రియఁ జేరు వారనియె వారే వీరు నిక్కంబుగాన్॥ 179

క॥ మురపాశపరివృతం। బాశరగిరిశస్త్రాగ్ని వాయుజలదుర్గంబై
కరమరుదగు ప్రాగ్జ్యోతిష। పురమొరులు జయింపఁగలరె భువి హరిదక్కన్॥

## పారిజాతాపహరణము.

క॥ కుండలములు దితికిచ్చెన్। మండలము లభించినట్లు మాతయు మెచ్చెన్

భూఁదనమునఁబరిపిచ్చెఁగా। హింసనమునఁబారిజాతమింటికిఁదెచ్చెఁగా॥ 181
శా॥పోలోమీరిత రీతిఁగా నదితికిన్ భక్తిప్రయుక్తాంకము
ల్పైలోమీఱఁగసత్యభామ వినతుల్గావించిసేవించుపెం
పాలోమీజెనవేడ్కఁజేఁగనుచు నిత్యాగణ్యతారుణ్యముల్
మీలో మీరనురక్తినొందుఁడనుచున్ దీవించెదేవాంబయున్॥ 182
మ॥ హరికే చెల్లెనుగాక పాకరిపు నుద్యానంబుఁగాల్పింపఁగాఁ
బరమెవ్వారికిఁ బారిజాతమిల కేధన్యుండుగా కన్యులె
వ్వరు దేఁజాలిరి కేలికేలములఁద్రావన్ గోపులంబ్రోవ భూ
ధరమెత్తం గరినాత్త మత్తులను మొత్తన్ గొల్లకుంజెల్లునే॥ 183

సాత్రాజితీ గౌరవాభివర్ణనము.

మ॥ క్షితి ప్రార్థింపఁ దదర్థమై యవతరించెన్ గృష్ణుఁడై విష్ణుఁడా
క్షితి సాత్రాజితిరూపమూని జనియించెంగాన సర్వోన్నతా
దృతి పాత్రంబయి సత్యభామదనరాచెం గానిచోఁ బారిజా
త తరుప్రాపణమే నిదర్శనము సౌందర్యాదు లట్లుండఁగా॥ 184

శ్రీ రుక్మిణీప్రణయకలహ నివారణము.

శా॥ఓహో రుక్మిణి లక్ష్మియయ్యుఁ దనపెంపూహింప నట్లుండెఁ ద
న్మోహోద్రేకముఁ దీర్తునంచు పిరసంబుల్ వల్కి యుల్కించి పూ
ర్వాహోపూరుషకం బెకల్పి సదయుండై తల్పియంజెట్లటుల్
స్నేహోత్సాహము లేర్పడంగ నలరించెం గృష్ణుఁడారుక్మిణిన్॥ 185

నారదసందేహ నివారణము.

చ॥ లలిఁ బదియాఱువేల సతులం బదియుం బదియాఱువేల రూ
పులగుచుఁ బెండ్లియాడెనఁట,పోయి కనంగొనివత్తునిప్డు దే
వెలువుననుండునోయనుచుఁ జిత్తమునందలపోసి నారదుం
డెలమిని ద్వారకా నగరికేగి సవిస్మయుఁడయ్యెఁదత్కృతిన్॥ 186

అతిథిసత్కార ప్రశంస.

సీ॥ కృష్ణస్వభావపరీక్షకై మాధ్వాసుఁడరుదెంచి వికటచర్యల నటించి
పాయసవాంఛఁ దీర్పవె కృష్ణయననట్లుహూర్చితెచ్చినవానిఁ గొంతగుడిచి
తనమేన నలఁదించుకొని కొంతరుక్మిణీకాంత కలందియయ్యెఁతిరథ్య
రూపిణిగా రథారూఢుఁడై కొట్టుచునల్లటపెట్టియాశెల్లఁజట్టి

యగ్గలితమొగ్గరిలనగ్గి డిగ్గనఁటికి। బుగ్గిపైఁజల్లి పాయసంబునాఁడ కెల్లఁ
బూసిరివికృష్ణ యడుగునఁబూయవైరి। వందుఁదక్కౄమతెందుఁగిడొందవనుచు॥

మ॥ కరుణింపం దలపోసి రుక్మిణిని టుల్ గాసిల్లఁ గాఁ జేసి యా
తరుణింజూచి వెలందులందు నజహాత్సౌందర్యసౌభాగ్య వి
స్ఫురణస్నిస్తులవౌదు వీవని చనత్ శోభావిభూత్యన్నతిం
బురణించెం దమదేహగేహములు విప్రుత్ మెచ్చిరా దంపతుల్॥ 188

## దూర్వాసుని జన్మ వృత్తాంతము.

సీ॥ శ్రుతులశ్వములు చంద్రసూర్యులుఁ జలు భూమిరథము విధాత సారథి సురాద్రి
ధను వసంతుఁడు నారి దారథికుండునై, యమపుంఖ శుచిశల్య హరిశరమున
రుద్రుండు త్రిపురాసురుల సంహరించి మన్మయ్యుత్ర్రము నిజాంకమందుఁ జేర్చి
కూర్చుండెఁ బంచశిఖుఁడగు సంయమియయ్యనత్యమ్ము నెయ్యమ్మహాత్రి
కృత్తివాసుండు దుర్వాసుఁడీతఁడని యో। నత్రిప్రార్థింపఁ దత్పుత్రుఁ డయ్యె నతఁడు
నిగ్రహానుగ్రహసమర్థుఁ డుగ్రుఁ డాగ్ర। హించి బ్రహ్మాండము దహించుఁ బెంచు దయను॥

## సుభద్రా పరిణయము.

సీ॥ శపథభంగంబు బీజము గాఁగ విజయుండు తీర్థయాత్రకు శైలు దేరునపుడు
లూచి చిత్రాంగద నేచి వివాహమై యతివేషమున ద్వారవతికి రాఁగ
నతని చిత్తమెఱింగి హరియంతిపురిఁ జేర్చి పరిచరించుటకు సుభద్ర నునిచి
పశుపతి పూజనెపంబుగా రామాదిఘనుల నంతర్ద్వీపమునకుఁ జేర్చి
తానునింద్రుఁడు స్మరణమాత్రమునఁ గూడి। పెండ్లి చేసి సుభద్ర విజయున కిచ్చి
హలి కినుక మాన్పి వారికి హరణమొసఁగి। పాండవావృతుఁడై వచ్చె ద్వారవతికి॥

## కైలాసయాత్రా ప్రశంస.

సీ॥ రుక్మిణి వాంఛఁ దీర్చుటకుఁ బుత్త్రార్థియై వాసుదేవుండు కైలాసయాత్ర
కై వెలువడి బదరీవనంబున ఘోరతపమొనర్చుచున్నతఱిఁ బిశాచ
నాయకుండైన ఘంటాకర్ణుఁ డలకృష్ణుఁ డెంపొప్పఁ గని తగిలింతు నెప్పు
డనుచు వేఁటాడుచు నాత్మసన్నిధికిరాఁ బ్రశ్నోత్తరములఁ దద్భక్తి సరసి
లోను వెలి నేకరీతిఁ గాఁ దానతోఁచి। ద్విజశవము పావనము దీనిఁ దినుమన నగి
హితమెఱిఁగి సాయుజ్యహేతువైన। దివ్యరూపమొసంగె భక్తికెనగలదె॥

## ప్రద్యుమ్నోపాఖ్యానము.

సీ॥ ప్రద్యుమ్నుఁడైపుట్టె రతిపతి రుక్మిణీకృష్ణులకు కని విని కీడు మూడు

నని శంబరుఁడు సప్తమనిశీథమున మాయవలన దొంగిలి వాని వార్ధిఁ వైవ
నొకమీను మ్రింగె జాలికుఁడు దానిం బట్టి యిత్తుమతీపురి కేగి శంబ
రావరోధమగు మాయావతి కొసఁగెఁ దద్గర్భముఁ జించి యందర్భకుఁ గని
పెంచి మాయలు నేర్చి మోహించి తాను। రతియగుటఁ దెల్పి పురికొల్ప రక్కసుని వ
ధించి యతఁడు నమ్మాయావతియును రాఁగ। యదుకులము సంతసిలె నారదాభినుతిని॥

## రామకృష్ణుల సంతాన ప్రశంస.

క॥ శరుఁ డుల్ముకుండు రణ। కర్మఠులగు పుత్త్రులుగఁ బడసె రాముఁడు పుత్త్రిం
గతినచ్ఛం గనకాంగిం। బరసియగుణాఢ్య సుభద్రపట్టి కొసంగెన్॥ 193

సీ॥ సరవిఁ బ్రద్యుమ్నుండు చారుచంద్రుండును జారుదేష్ణుండును జారుబాహు
జారుదేహ సుచారు చారుగుప్త విచారు భద్రచారు సుదేష్ణు లద్రినిభులు
పదుగురు తనయులొప్పెఁ జారుమతియను తనయ రుక్మిణియందు జననమైరి
సాంబ సహస్రజిచ్ఛతజిత్సుమిత్ర మిత్ర క్రతు విజయులు ద్రవిడ చిత్ర
కేతు పురజిత్తు లనఁగఁ బ్రఖ్యాతిగన్న। సుతులఁ బదుగురఁ గని మిత్రవతియనంగ
వినుతికెక్కిన చక్కని తనయ నొకతెఁ। గనియె జాంబవతీదేవి మనము దనియ॥

సీ॥ భానుఁ బ్రభాను స్వభాను స్వర్భాను శ్రీభాను బృహద్భాను భానుమంతు
నతిభానుఁ బ్రతిభాను నలచంద్రభానునిఁ జారుభ్రమరికను సత్య గనియె
శ్రుతకవి వృష వీర సోమక శాంతి భద్రులు పూర్ణిమాసదర్శులు సుబాహుఁ
డను పదుగురు పుత్త్రులను గాత్రవతియను తనయ వికర్తనతనయ గనియెఁ
బవన వృష నార గృధ్రాంక వహ్ని నర్థ। నానిల మహాసన త్యుద్ధు లనెడు సుతులఁ
బదువురను భద్రవతియనఁ బరఁగు సుతను। వేడ్కలిగు రొత్తగా మిత్రవిందగనియె

సీ॥ వీర చంద్ర వృషాశ్వసేన వేగవ దామ వసు కుంతి శంకు వీర సదభిఖ్యు
లగు పదుగురు పుత్త్రుల నలస్వేతయనంగఁ జెలఁగు పుత్త్రిని నాగ్నజితియు గనియె
శర విశూర సుభద్ర సంగ్రామజిద్వామ సత్యక ప్రహరణ జయులు హరిచి
రాయుర్బృహత్సేనలను పుత్త్రులను దామ్రపత్రికయను సుత భద్ర గనియె
బలుఁ బ్రఘోషుని సింహుని ప్రబలు నూర్ధ్వ। సహజు నపరాజితుని మహాశక్తి నజుని
గాత్రవంతుని సుతదశకంబుగా జ। లందమను పుత్త్రి గాఁ గనె లక్షణయును॥

సీ॥ వినుఁ డింకఁ బదియాఱువేల నూర్గురియందుఁ బ్రత్యేకముగ సుతుల్ పదుగురేసి
పుట్టిరి వారును బుత్త్రిలఁ గాంచుచు యదువృష్ణిభోజాంధకాదులనఁగ
జగతి నేకోత్తరశతశాఖలైరి!ల్లు ప్రబలిన హరిపుత్త్రపౌత్త్రజనము

నవమూఁడుకోట్లయెన్బదియొనిమిదివేల నూర్గురుగురువులా వర్గసంఖ్య
భర్గుఁడైననుగృతజగత్సర్గుఁడైన। నింతయనిచెప్ప లేరన్న నితరులెన్నఁ
గలరెవలతే నితంత్రిజగత్కుటుంబి। తత్కుటుంబముగానిది ధరణిఁ గలదె॥

శా॥ కుబ్జాకృష్ణులకుద్భవించి సువివేకుండై యుపశ్లోకుఁడ
య్యబ్జాతాసనుపుత్త్రిశిష్యుఁడయి దివ్యజ్ఞానియై తాను
ష్టుబ్జాలంబునఁగూర్చె సాత్వతమనం జూపట్టు తంత్రంబదే
న్యబ్జాస్త్రీపరిచారికాపదజమోక్షోపాయమంత్రంబుగన్॥ 198

అనిరుద్ధవివాహమహోత్సవము.

సీ॥ స్వస్యవత్సలుఁడు రుక్మిస్వసుతయై తగురుక్మవతిని శ్రీరుక్మిణీసుతులయందుఁ
బ్రద్యుమ్నునకొసంగి ప్రద్యుమ్నసుతుఁడైన యనిరుద్ధునకుఁదన మనుమరాలి
రుక్మలోచనయను రుచిరాంగి నొసఁగెఁ దత్పరిణయాగతులైన ధరణిపతులు
పెరరేపఁగా దురోదరమున దబ్బరలాడిన రుక్మిని హలి వధించెఁ
బరిణయానంతరమున దంపతులఁదోడు। కొనుచు ద్వారక కేతెంచి రనుపమాన
మానసీయోత్సవంబుతో మాధవాదు। లవల బాణాసురుని గర్వమడఁచి విడిచె॥

ఉషా పరిణయము.

సీ॥ హరదత్తవరమత్తుఁడగుచు బాణాసురుండతఁడు గావలియుండ నతిశయించి
యుండెఁ దత్పుత్త్రికయుష యొక్కచక్కనిపురుషుతో స్వప్నసంభోగమొంది
మందటివలెనుండ మిందెలిసి తదాప్తసఖి చిత్రరేఖ తత్స్వాంతమెఱిఁగి
రాజరూపములెల్ల వ్రాసి చూపఁగ ననిరుద్ధునిఁ జూపి తత్సిద్ధిఁ గోర
యోగబలమునఁ బ్రియుఁదనకొసఁగ నతని। వలననుష గర్భవతియాటఁ దెలిసి బాణుఁ
డతని ఫణిపాశమునఁగట్టె నని విని హరి। శోణపురికేగి చేసిన చొప్పు వినుఁడు॥

బాణాసురగర్వ పరిహారము.

సీ॥ వాసుదేవుండు కైలాసయాత్రకుఁ బోయి యుపమన్యునుపదేశమొంది ఘోర
తపమొనరింపఁ బ్రత్యక్షమైత్ర్యక్షుండు మున్నువరంబిచ్చి యున్నదియును
బ్రహ్మమునకు వధింపఁ ద్వదీయులనటంచు మున్ను వరంబిచ్చియున్నదియును
గారణంబులుగ రక్షకుఁడై యెదిర్చిన ఫాలాక్షునంతలో పలవిదిర్చి
సమవివాదవివాహముల్ శ్లాఘ్యములని। పట్టి బాణాసురుని చతుర్బాహుఁ జేసి
విడిచి యుషతోడ ననిరుద్ధువెడ్కగాఁగఁ। దోడ్కొనుచు వచ్చె ద్వారకాదుర్గమునకు॥

